# దశకుమార చరిత్ర





రచన:
శ్రీ యం. సంగమేశం, ఎం.ఏ.




ఉమా పబ్లిషర్సు
విజయవాడ-1

# దశకుమార చరిత్ర




కుమారోత్పత్తి !—

పూర్వం పాటలీపుత్రంలో రాజహంసుడనే రాజు రాజ్యం చేస్తూ ఉండేవాడు. అతని రాణి వసుమతీ దేవి. అతనికి ధర్మపాల, పద్మోద్భవ, సితవర్మలనే ముగ్గురు మేధావులైన మంత్రులుండేవారు. వీరందరూ సత్సంతానవంతులై, ధర్మం తప్పకుండా రాజ్యం నెరపడంలో రాజహంసునికి సహాయ్యపడి సలహాలిస్తూ ఉండేవారు. ధర్మపాలుని కుమారుల్లో సుమంత్రుడు, సుమిత్రుడు అనేవారు వయస్సు రాగానే రాచకార్యాల్లో పాల్గొనసాగేరు. కాని మూడవ వాడైన కామపాలుడు భోగలాలసుడై తనవూళ్ళో తనివితీరక దేశయాత్రకి బయల్దేరి ఎక్కడెక్కడికో వెళ్ళిపోయాడు. పద్మోద్భవుని కొడుకుల్లో సుశ్రుతుడు చక్కగా చదువుకొని రాజ్యాంగాల్లో తన ప్రతిభా విశేషాలు చూపుతూ ఉంటే రెండవ కొడుకు రత్నోద్భవుడు ధనాకాంక్షతో విదేశ వ్యాపారం చేయబోయి, సముద్ర యాత్రకి బయల్దేరాడు. సితవర్మ పెద్దకొడుకు సుమతి బుద్ధిమంతుడై ఇల్లు చక్కదిద్దుతూ ఉంటే చిన్న కొడుకు విరాగియై తీర్థయాత్రలు మరిగేడు. కాలక్రమాన్న వృద్ధులైన మంత్రులు గతించారు. వారి పదవులు వారి కుమారులకే సంక్రమించి నందున,

వారు గతించినారనే లోటు కనబడకుండా రాజ్య చక్రం నడుపుకొంటున్నాడు రాజసింహుడు. అతడు స్వతః వివేక శాలి; వీరుడు; ఔదార్యమూ అభిమానమూ కూడ కలవాడు.

ఒకసారి రాజహంసుడు మాళవ దేశంపై దండెత్తి వెళ్ళేడు. మాళవ రాజు మానసారుడు కూడా బలవంతుడు. అందుచేత నిర్భయంగా రాజహంసునితో యుద్ధం చేసి, దైవవశాత్తూ ఓడిపోయాడు. కాని రాజహంసుడు అతని సాహసానికి మెచ్చుకొని అతని రాజ్యం తిరిగి అతనికే యిచ్చివేసేడు. అయినా మానసారునికిది అవమానమని పించింది. అతడు తపస్సు చేసి ఈశ్వరుని దయవలన ఒక గద సంపాదించేడు. ఈ ఆయుధం తిరుగులేనిది. దీని సహా యంతో రాజహంసుని ఓడించడానికని అతడు మగధపై దండెత్తివచ్చేడు. రెండు పక్షాల వారికీ మహా భయంకర మైన యుద్ధం జరిగింది. రాజహంసుని బాణాలు మానసారుని గదను తునాతునకలు చేసినా, ఆ ముక్కలు తగిలి రాజ హంసుని సారథి, వీరస్వర్గ మలంకరించాడు. సారథిలేని గుర్రాలు, పట్టు దప్పి. రాజహంసుని రథాన్ని యుద్ధభూమి నుండి తప్పించి దూరంగా ఉన్న ఒక అడవిలోకి తీసికొని పోయాయి. రాజు పారిపోయాడనగానే సేనలు చెకాపికలై పోయాయి. మానసారుడు విజయగర్వంతో పాటలీపుత్రాన్ని ఆక్రమించి పాలించసాగేడు.

యుద్ధం ముమ్మరంగా సాగుతూన్నప్పుడే, జయాప జయా లెటు మొగ్గుతాయో అని శంకించి, రాజహంసుని మంత్రులు మహారాణీని వింధ్యాద్రి అడవులకి గుప్తమార్గాన్ని పంపించివేసేరు. రాజు పారిపోయిన పిదప, కొంత సేపు యుద్ధం చేసి తాముకూడా మహారాణీని కలుసుకోనేందుకని వింధ్యాటవులకి మళ్ళిపోయారు. వారి ద్వారా యుద్ధ పర్యవసానాన్ని విని, రాణి అగ్ని ప్రవేశం చేసి మరణించబోయింది కాని మంత్రుల ప్రార్థనమీద ఎలాగో ప్రాణాలు నిల్పుకొంది. అదిగాక ఆమె ఆ సమయంలో నిండు చూలాలు. రాజుగారు పారిపోయారే కాని, బ్రతికి ఉన్నారేమో అనే ఆశ కూడా ఇంకా ఉండనే ఉంది. కాని పగలెలాగో ఆపుకొన్న ఆమె దుఃఖావేశం రాత్రి అందరూ నిద్రించిన పిదప తిరిగి పెల్లుబికినట్లయింది. ఏ చెట్టుక్రిందనో చేరి ఉరి పోసుకుందామని నిశ్చయించి, ఆమె ఆ కటిక చీకటిలో బయల్దేరి, చీమ చిటుకుమనకుండా నడిచి, ఓ జీబుగా ఉన్న బూరుగుచెట్టు దగ్గరకి చేరుకుంది. కాని అదే చెట్టుకి సమీపంలో వచ్చి నిల్చిఉంది రాజహంసుని రథం. రాజహంసునికి ఆ చీకట్లో ఒక ఆర్తనాదం వినిపించినట్లై, తిరిగి వినేసరికి అది రాణి కంఠస్వరమే నని తెలిసేసరికి, ఎక్కడలేని ఆతురమూ కలిగి అతడు తటాలున రథం దిగి, ఖడ్గ మాత్ర సహాయుడై ఆమెను రక్షించడానికి పరుగెత్తి వచ్చేడు. రాణి ఆ బూరుగుచెట్టు కొమ్మకు తన ఉత్తరీయం

తగిలించి ఉరి పోసుకోబోతూంది. వెంటనే రాజా మె నా ప్రయత్నం నుండి తప్పించి, కౌగలించుకొన్నాడు. తర్వాత ఆ దంపతు లిద్దరూ మంత్రి పురోహితాది పరివార వర్గమున్న చోటికి వచ్చారు. తలవని తలంపుగా రాజుగారి దర్శనం లభించినందుకు వారికి పట్టరాని సంతసం కలిగింది.

మర్నాడు వారంతా కలిసి ఆ అడవిలో ఉన్న వామ దేవ మహర్షి ఆశ్రమానికి వెళ్లేరు. ఆ మహర్షి వారి కథంతా విని "మీకు భవిష్యత్తులో మంచి జరుగుతుంది. ఇప్పటి కీ కీడు కొంత అనుభవించినా, అది మీ మేలు కే. ఈ రాణి గర్భవాసములో ఉన్న కుమారుడు అఖండ ప్రతాపశాలి అయిన చక్రవర్తి కాబోతాడు. అలాటి మంచిరోజులు వచ్చేదాకా మీరీ ఆశ్రమంలోనో, ఇక్కడికి సమీపం లోనో అజ్ఞాతంగా ఉండడం మంచి" దని చెప్పాడు. వారతని సలహా పాటించి అతని ఆశ్రమ సమీపంలో గుడా రాలు వేసుకొని కాలక్షేపం చేయసాగేరు.

ఒక శుభముహూర్తాన వసుమతీదేవి సర్వ లక్షణ సంపన్నుడైన కుమారుణ్ణి ప్రసవించింది. వామదేవుని సల హాతో అతనికి రాజహంసుడని నామకరణం చేయబడింది. కొద్ది రోజుల్లో మంత్రులలో సుమతికి ప్రమతి, సుమంతునికి మిత్రగుప్తుడు, సుమిత్రునికి మంత్రగుప్తుడు, సుశ్రుతునికి విశ్రుతుడు అని నలుగురు కొడుకులు పుట్టేరు. ఈ పిల్లలం దరూ శుక్లపక్షపు చంద్రునివలె పెరుగుతూ తమ ఆటపాట లతో తల్లిదండ్రుల దుఃఖాన్ని మరపింప జేస్తున్నారు.

రాజహంసుని స్నేహితులలో మిథిలకి రాజైన ప్రహారవర్మ ఒకడు. అతడుకూడ మానసారునితో పోరాడి ఓడిపోయాడు. అంతేకాదు ఓడిపోయి తన దేశం పోతుండగా అతణ్ణి దారిలో దొంగ లడ్డగించి దోచుకొన్నారు. ఈ హడావిడిలో తన భార్య ఒక ప్రక్కకి తానొక ప్రక్కకి అయిపోయారు. ఒక దాది చేతిలో ఒక బిడ్డడు, ఆమె కూతురు చేతిలో ఒక బిడ్డడు చిక్కి సురక్షిత స్థానం చేరబోతూన్న సమయంలో ఒక సింహం వారి మీదికి దూకింది. సరి. ఆ యిద్దరూ బెంబేలు పడి మూర్ఛపోయారు. దారినిపోతూన్న వ్యాధుడొకడా సింహాన్ని సంహారించి ఒక బిడ్డణ్ణి మాత్రం రక్షించగలిగాడు. రెండవవాని సంగతి ఏమయినదీ ఎవరికీ తెలియదు. తెలివివచ్చిన పిదప దాది తన కూతురుకోసం రాచ బిడ్డలకోసం గగ్గోలుపెట్టి ఏడ్వ సాగింది. సమీపంలో ఉన్న పల్లెలకి పోయి వెదికింది. ఒకానొక బ్రాహ్మడి సాయంతో ఒక బోయవానివద్ద ఒక బిడ్డణ్ణీ, మరో బోయవానివద్ద రెండవ బిడ్డణ్ణీ చూసి పోల్చుకొని, తిరిగి సంపాదించుకోగలిగింది. ఆ బ్రాహ్మణుడామెను బిడ్డలతోసహా రాజహంసునివద్దకి తెచ్చి అప్పజెప్పాడు. రాజా బిడ్డలిద్దరికీ ఉపహారశర్మ, అపహారశర్మ అని పేర్లు పెట్టి తక్కిన పిల్లలతోపాటు పెంచుతున్నాడు. మరో ప్రక్కనుండి వారి తల్లిదండ్రులకోసమని వెదికిస్తున్నాడు.

ఒకనాడు వామదేవుని శిష్యుడొకడు ఒక పసిపిల్లవాణ్ణి తెచ్చి రాజహంసునికిస్తూ ఇలా చెప్పాడు. "రాజా,

యీ బిడ్డడు మీ మంత్రి, సుశ్రుతుని తమ్ముడు రత్నోద్భవుని కొడుకు. అతడు దేశాంతరాలు పోయి, అక్కడ సువృత్త అనే ధనికురాలిని వివాహమాడి స్వదేశం వస్తూ ఉండగా, మార్గమధ్యంలో అతని ఓడ నీటి కెడమిచ్చి మునిగిపోయింది. భార్యాభర్తలు దైవికంగా వేరయారు. ఆ ఆపత్సమయంలో ఆమె ఈ బిడ్డను ప్రసవించింది. కాని పిల్లవాని నొక దాది చేతికిచ్చి ఆమె ఎక్కడికో పోయింది. రత్నోద్భవుని సంగతి కూడ ఆ దాదికి తెలియదు. ఆమె ద్వారా యీ బిడ్డమాత్రం గండాలు గడిచి జీవించగలిగేడు. ఇటుపై వానిని పెంచే భారం నీదే'' నని చెప్పి అప్పజెప్పాడు. రాజా పిల్లవానికి పుష్పోద్భవుడని పేరు పెట్టి ప్రేమతో పెంచసాగేడు.

ఇది ఇలాఉండగా ఒకనాటి రాత్రి రాణి వసుమతీ దేవి వద్దకి ఒక యక్షిణీ వచ్చి ఆమె చేతికో పిల్లవాణ్ణి పెంప కానికిచ్చింది. ''వీడు మీ మంత్రి కుమారుడైన కామపాలుని కొడుకు. నేను మణిభద్రుడనే యక్షుని కొమార్తెను. నాపేరు తారావళి. మీ కుమారుడు రాజవాహనుడు నవ ద్వీపాలు పాలించే చక్రవర్తి అవుతాడు. అప్పుడీ పిల్లడు పెరిగి అతణ్ణి సేవించి తన వంశపు ఖ్యాతి నిల్పుకొంటాడు'' అని చెప్పి ఆయక్షిణీ మాయమయింది. రాణికి మహా శ్చర్యం కలిగింది. ఆ పిల్లవాని సౌందర్యం చూసి ఆమె మాతృ హృదయం మరీ ముగ్ధత జెందింది. వానికి అర్థపాలు డని పేరుపెట్టి అల్లారు ముద్దుగా పెంచుతూంది. తక్కిన

పిల్లలతో పాటు వాడుకూడ దినదిన ప్రవర్ధమానంగా పెరుగుతున్నాడు.

మరొకనాడు వామదేవుని ద్వారా సత్యవర్మ కొడుకు కూడా వీరికే దొరికాడు. తీర్థయాత్రికి పోయిన సత్యవర్మ సంతానార్థియై యిద్దరు పిల్లల్ని పెళ్ళాడాడు. చిన్న భార్య సంతానవతి అయింది. అది చూడలేక పెద్ద భార్య ఆ తల్లి పిల్ల లిద్దర్నీ నదిలో తోయించేసింది. ఏటిలో కొట్టుకొచ్చిన పిల్ల డెలాగో వామదేవుని శిష్యుల్లో ఒకరికి దొరికాడు. రాజా పిల్లణ్ణి చేరదీసి, వానికి సోమదత్తుడని పేరుపెట్టి పెంచసాగేడు. ఇప్పటికీ పిల్లలందరూ పదిమందయ్యారు. ఎక్కడ చూసినా వీరి కలకలమే. చదువుకొనే ఈడు రాగానే వీరందరికీ విద్యాబుద్ధులు గరపే బాధ్యత వామదేవుడు వహించాడు. అతని శిక్షణలో పెరిగి వీరందరూ అనతి కాలంలోనే అరవైనాల్గు కళలలోనూ ఆరితేరారు. చదువు పూర్తి అయిందనేసరికి . యౌవనం కూడా వచ్చింది. అడవిలో ఉండే కిరాత జాతుల వారందరికీ వీరు నాయకులై ఒక సేన పోగుచేసుకొన్నారు. పెద్దల అనుమతీ, వామదేవుని ఆజ్ఞ పొందడమే తడవుగా శత్రువుల మీదికి దండెత్తి తిరిగి తమ రాజ్యాన్ని తాము సంపాదించాలనే పట్టుదల రోజు రోజుకీ పెంచుకొంటున్నారు.

పాతాళయాత్ర !—

ఒకానాడు పదిమంది కుమారులు రాజహంసుని వద్ద కూర్చొని ఇష్టాగోష్ఠి జరుపుతుండగా మహర్షి వామదేవు

దక్కడికి వచ్చాడు. అందరూ లేచి ఆయనకు స్వాగత సత్కారాలాచరించారు. వారి నాశీర్వదించి అర్ఘ్యాసనాశీనుడై వామదేవుడా రాజుతో ఇలా చెప్పాడు. "మహారాజా, నీయీ కుమారులందరూ విద్యా వివేక సౌశీల్య వినయాది గుణాలు కలవారు. వీరిని చూస్తే నాకెంతో ఆనందం కలుగుతూవుంటుంది. వీరివల్ల నీ మనోభీష్టం తప్పకుండా నెరవేరగలదు. రాజవాహనుడు నాయకుడై, తక్కిన మిత్రుల సలహాలు పాటించి దిగ్విజయ యాత్ర చేసి వస్తే మంచిదని నా అభిప్రాయం. అందుకు తగిన వయస్సు వీరికి వచ్చింది. మీకు మేలు చేకూరే సమయంకూడ ఆసన్నమయింది. దిగ్విజయాత్ర కనుకూలమైన ముహూర్తం కూడ ఆసన్నమయింది. దిగ్విజయాత్ర కనుకూలమైన ముహూర్తం కూడ రేపే తటస్థిస్తూంది.

వామదేవుని మాటలు విని రాజహంసు డెంతగానో సంతసించాడు. "మీ యాజ్ఞకు మించిన మంచి ముహూర్తం మాకు వేరేలేదు" అని చెప్పి తక్షణం కుమార దశకాన్ని యుద్ధయాత్ర కాయత్తులు కండని ఆజ్ఞాపించాడు. క్షణంలో సైన్యాలాయత్తమయాయి. ప్రయాణ సంభారాలు సమకూడేయి. రావుతులు, రాజకుమారులు మహోత్సాహంతో బయల్దేరారు. వామదేవు డాశీర్వదించాడు. రాజు యథోచితమైన సలహాలిచ్చి దీవించాడు. రాజవాహనుడు తన మిత్రమండలితో కలిసి గ్రహాలతో కలిసి నడుస్తూన్న గ్రహరాజులా వెలుగుతూ దిగ్విజయానికి బయల్దేరాడు.

పోగాపోగా ఒకచోట రాజవాహనునికి ఒక నల్లటి ఉక్కుమనిషి కనిపించాడు. వాని శరీరంమీద కత్తిదెబ్బల మచ్చలున్నాయి. కాని జందెం కూడ భుజంమీద వ్రేలాడు తూంది. అతడు బ్రాహ్మణుడా? క్షత్రియుడా? అనే సంశయం కలిగి ప్రశ్నించబోయే లోపుగా అతడే రాజవాహనునితో తన రామాయణం ఇలా వినిపించి చెప్పాడు.

"రాజకుమారా, నేను వ్యాధులలో కలిసి కులభ్రష్టులైన బ్రాహ్మణుల సంతతివాణ్ణి. బ్రహ్మణాచారం, బ్రాహ్మణ ధర్మం మరిచిపోయి, ఆటవికుల అలవాట్లు, వారి కుల విద్యలు నేర్చుకొని పెరిగాను. ఎందరినో దారికాచి, చంపి, వారి సొత్తు లపహరించాను. కాని ఒకసారి, అదేకారణం చేతనో గాని, నాకొక బ్రాహ్మణునిపై దయ కలిగింది. అతణ్ణి చంప లేదు సరికదా, అతడికోసమని నేను మిగత బోయవాళ్ళతో వివాదపడ్డాను. అది కారణంగా నేను వారి చేతిలో మృతి జెంది యమలోకానికి పోయాను. బ్రాహ్మణ్ణి కాపాడిన పుణ్యానికిగాను యమధర్మరాజు తిరిగి నన్ను భూలోకానికి పంపించాడు. తిరిగి నేను నాపూర్వ శరీరంలోకే వచ్చాను కాని నా పూర్వపు బుద్ధిమాత్రం నాకు రాలేదు. మరొక బ్రాహ్మణుని దయవల్ల నేను సమస్త శాస్త్రాలు చదువుకో గలిగాను. నా పేరు మాతంగుడు. నాకు నీవల్ల కొంత సహాయం కావలసిఉంది. చేస్తానని మాట ఇస్తే నేను నీకా సంగతి విన్నవించుకొంటాను."

ఆ మాటలు వినగానే రాజవాహనుని ఆశ్చర్యానికి అవధిలేకపోయింది. సహజంగా ఉదారుడు, వీరుడు కాబట్టి బ్రాహ్మణుడాసించిన సహాయం తనకవశ్య కర్తవ్యమని భావించి, అతడు 'సరే' నన్నాడు. మాతంగుడతణ్ణి రహస్య స్థలానికి తీసుకొనిపోయి ఏకాంతంగా కొంత ప్రసంగించి, తనకు పాతాళలోకానికి మార్గం తెలుసుననీ, అక్కడికి పోతే తానా దేశపు రాజు కాగలననీ, ఆ కార్యంలో రాజవాహనుడి సహాయ్యం తనకు కావాలనీ చెప్పాడు. 'తథాస్తు' అని రాజవాహనుడు తక్షణం వానితో బయల్దేరి పాతాళమార్గం పట్టాడు. మిగిలిన వారెవరికీ వీరెక్కడికి పోయినదీ తెలియదు. వారు రాజవాహనుడికోసం చూస్తున్నారు.

రాజవాహనుడు పాతాళం చేరుకున్నాడు. అక్కడికి చేరిన వెనుక మాతంగుడొక యజ్ఞం చేసి, హోమకుండంలో గెంతి తన శరీరాన్ని అగ్ని కర్పించాడు. కాని మరుక్షణమే దివ్య శరీరధారియై అగ్నికుండం వెడలి వచ్చాడు. అదే సమయానికి ఒక సలక్షణమైన రూపవతి, తన చెలికత్తెలతో సహా అక్కడ ప్రత్యక్షమయింది. ఆమె మాతంగునికో వజ్రాన్ని బహూకరిస్తూ ఇలా చెప్పింది.

"బ్రాహ్మణోత్తమా, నేను అసుర రాజు కుమార్తెను. పేరు కాళింది. దేవతలతో పోరి మా తండ్రి గతించాడు. నేను దుఃఖోద్విగ్ననై మరణించబోగా, నిన్ను

పోలిన వ్యక్తి ఇక్కడికి వస్తాడనీ, అతడే నన్నూ, యీ రాజ్యాన్నికూడ గ్రహిస్తాడనీ ఆకాశవాణి వినిపించింది. ఇన్నాళ్ళకా వాక్యం సత్యమయింది. నన్నూ, నా రాజ్యాన్ని కూడ పరిగ్రహించ వలసిందని నిన్ను ప్రార్థిస్తున్నాను. ''

మహానందభరితుడై మాతంగుడా కన్యను పెళ్లాడి పాతాళానికి రాజయ్యాడు. రాజవాహనుడు కూడ కొన్నాళ్ళక్కడ నిల్చి, అతడి రాచకార్యాలలో సహాయపడ్డాడు. కాళింది ద్వారా మాతంగునికి ఆకలి దప్పికలు పోగొట్టే మణి ఒకటి సంక్రమించింది. మాతంగుడా మణిని రాజవాహనుడికిచ్చి, సమస్త మర్యాదలు చేసి, అతణ్ణి తిరిగి భూలోకానికి అంపకం పెట్టాడు.

రాజవాహనుడు భూలోకానికి వచ్చి చూస్తే, మొదట తను విడిచినచోట తన మిత్రులుగాని, సేనగాని ఏమీ కనపడలేదు, వారితణ్ణి వెతుకుతూ తలొక మార్గంపట్టి పోయారు. ఇతడు వారిని వెతకడానికి బయల్దేరి కొన్నాళ్ళకి శిలానగరం చేరుకొన్నాడు. అక్కడొక ఉద్యానవనంలో కూర్చొని విశ్రాంతి తీసుకొంటూండగా అతడికి దూరంనుండి వస్తూన్న ఒక పల్లకీ కనిపించింది. దగ్గరగా వచ్చేసరికి ఆ పల్లకిలో ఒక స్త్రీ, ఒక పురుషుడు కనిపించారు. ఆ పురుషుడు రాజవాహనుని చూడగానే, తటాలున పల్లకీ నుండి క్రిందికి గెంతి వచ్చి, అతణ్ణి కౌగలించుకొన్నాడు.

"అరే, సోమదత్తా, నువ్వేనా" అంటూ ఆశ్చర్యానందాలు ముమ్మరంగా కలిగి రాజవాహనుడతణ్ణి మరింత

బిగ్గరగా కౌగలించుకొన్నాడు. మిత్రులిద్దరికీ కళ్ళంట ఆనంద బాష్పాలు రాలేయి. ఏదో పెన్నిధి దొరికినంత ఆనందం అనుభవించారు.

తర్వాత తాపీగా సోమదత్తుడు తన కథ చెప్పనారంభించాడు.

సోమదత్తుని కథ ! —

"రాజకుమారా, నీవా మాతంగునితో కలిసివెళ్ళిపోయిన పిదప, చాలవరకు మేము నీకోసమని ఎదురు చూసి విసిగిపోయాము. చివరకు నిన్ను వెదకడానికని తలొక దిక్కునా బయల్దేరినాము. నేను వెళ్ళివెళ్ళి ఒక చెరువు ఒడ్డున చేరాను. అవి వేసవిరోజులు కదా ! నాకు మిక్కిలి దాహమయింది. చెరువులో దిగి పుడిసిలితో నీరు తీసుకొని త్రాగబోయేలోగా నాకా నీటిలో ఒక వజ్రం కనిపించింది. నేను దానిని తీసి భద్రపరచి, నీరు త్రాగి, తిరిగి బయల్దేరాను. కొంతదూరం పోయిన వెనుక నాకొక బ్రాహ్మణుని యింట ఆతిథ్యం లభించింది. అతని వలన, అది వీరకేతుని రాజ్యమనిన్నీ, ఆ రాజుపై లాటదేశపురాజు మత్తకాలుడు దండెత్తి వచ్చి విడిసినాడని తెలుసుకొన్నాను. "వీరకేతుని కుమార్తె వామలోచనను మత్తకాలుడు వరించదలచాడు. అదే యీ యుద్ధానికి మూల కారణం. వీరకేతువు సపరివారంగా ఓడి పారిపోయి అడవులు పట్టి పోయాడు. కాని మంత్రులు పంతగించి మత్తకాలునితో పోరాటం సాగిస్తున్నారు" అని కూడ ఆ బ్రాహ్మణుని వల్ల విన్నాను.

"ఆ బ్రాహ్మణుని యింట విందారగించి నే నతనికి నాకు చెరువులో దొరికిన వజ్రాన్ని కానుకగా యిచ్చాను. తర్వాత నేను కొంతసేపు విశ్రమించి నిద్రనుండి లేచే సరికి ఆ బ్రాహ్మణుని కట్టి తెస్తూన్న రాజభటులు నావైపే వస్తూ కనిపించారు. వారతణ్ణి వజ్రాపహర్తగా భావించి బంధించా రని తెలుసుకొని నేను నిజం చెప్పి అతణ్ణి విడిపించాను. కాని వారీసారి నన్ను బంధించి తీసుకొనిపోయి చెరసాలలో పెట్టారు. వారు మత్తకాలుని సిపాయిలు. జైలులో నాకు వీరకేతుని ఆప్తులు కొందరు స్నేహితులయ్యారు. నేను వారితో కలిసి జైలునుండి ఆవలకి ఒక సొరంగం త్రవ్వి ఎలాగో బయటపడ్డాను. ఈసారి మేమంతా వీరకేతుని మంత్రి మానపాలుని వద్ద చేరుకొన్నాము.

"ఇది తెలిసి మత్తకాలుడు మరీ క్రుద్ధుడయ్యాడు. ఇరువాగులకు మళ్ళా పోరు ఘోరమయింది. భగవదను గ్రహంచేత యీసారి మానపాలుడు జయించాడు. మత్త కాలుడు వీరస్వర్గ మలంకరించాడు. తర్వాత వీరకేతుని వెదకి అతని కీసమాచారం సొంతంగా విన్నవించి తెచ్చి, తిరిగి అతణ్ణి సింహాసనాసీనుణ్ణి చేయగలిగాము. ఈ యుద్ధంలో నేను చేసిన సాహాయ్యానికి మెచ్చి, వీరకేతువు వామలోచ నను నాకిచ్చి వివాహం చేసేడు. రాజ్యానికి కూడా నన్నే ఉత్తరాధికారిగా నియమించాడు.

"ఇంతగా సుఖిస్తూన్నప్పటికీ, మిత్రమా, నిన్ను తలుచుకొన్నప్పుడల్లా నాకదేదో లోటనిపించి దుఃఖం కలు

గుతూ ఉండేది. ఒక మహాత్ముని ఉపదేశాన్ననుసరించి, యీ రోజున శివాలయంలో పూజజేసి నిన్ను కలుసుకో బోతున్నాను. ఇంతలో నీవే కనుపించావు.'' అని చెప్పి సోమదత్తుడు రాజవాహనుణ్ణి సకల మర్యాదలతోనూ తన పల్లకీలో ఎక్కించుకొని శివాలయానికి బయల్దేరాడు. రాజ వాహనుడతనికి తన పాతాళ యాత్ర వృత్తాంతమంతా చెప్పి ఆనందింప జేసేడు. ఇంతలో శివాలయం సమీపిం చింది. పూజాదికం నిర్వర్తించి వచ్చేలోగా వీరి మిత్రుడు పుష్పోద్భవు డక్కడికి వచ్చి చేరుకొన్నాడు.

అకస్మాత్తుగా కలిగిన యీ మిత్రుని చూసి రాజ వాహన సోమదత్తు లిద్దరూ బ్రహ్మానంద భరితులయ్యారు. వారి కోర్కెపై పుష్పోద్భవుడు తన కథ ఇలా చెప్పాడు.

పుష్పోద్భవుని కథ :—

"రాజ కుమారా, నిన్ను వెదకుతూ వెళ్లి నేనొక కొండ ఒడ్డున చేరుకొన్నాను. అప్పటికి బాగా అలసిపోయి నందున అక్కడో చెట్టుక్రింద విశ్రాంతి తీసుకొనేందుకని కూర్చున్నాను. ఇంతలో మీదనుండి ఒక వ్యక్తి క్రిందకు దొర్లుతూ కనిపించాడు. నేను వెంటనే పరు గెత్తి వెళ్లి అతణ్ణి నా చేతులలోకి తీసుకొని కాపాడాను. అతడప్పుడు మూర్ఛావస్థలో ఉన్నాడు. కొంతసేపటికి తెప్పి రిల్లి, దాహం తీర్చుకొని నాతో ఇట్లా చెప్పాడు. "అయ్యా, నేను మగధ దేశపు మంత్రి పద్మోద్భవుని కుమారుడను.

నా పేరు రత్నోద్భవుడు. నేను వర్తకానికని కాలయవన ద్వీపానికి వెళ్ళి, అక్కడ ఒక వర్తకుని కుమార్తెను పెళ్ళాడి, కొన్నాళ్ళు సుఖించి, భార్యా సమేతంగా ఇంటికి తిరిగి వస్తూండగా దారిలో మా పడవ తుపానుపాలై భగ్న మయింది. నే నెలాగో బ్రతికి బయటపడ్డాను. కాని భార్య గాని, పరిచారకులుగాని ఒక్కరూ కనపడలేదు. వారి జాడలు వెదకుతూ పదహారు సంవత్సరాలు ఎలాగో గడి పాను. చివరికి విసిగి, నిరాశుడనై యీ కొండ శిఖరంనుండి గెంతి ఆత్మహత్య చేసుకోబోతే నీవు నన్ను రక్షించి మరింత దుఃఖపెట్టావు'' అన్నాడు. అతనికి ధైర్య వచనాలు చెప్తూ నంతలో నా కొక స్త్రీ రోదన ధ్వని వినిపించింది. అతణ్ణి అక్కడే విశ్రాంతి తీసుకోమని చెప్పి నేనా ఏడుపు వినిపి స్తూన్న దిశగా వెళ్ళాను.

అక్కడ ఒక స్త్రీ అగ్నిలో దూకుతూంది. ఆమె నొక ముసలిది నివారిస్తూంది. ఎలాగో ఆమెకు సాయపడి నేనా సుందరి ప్రయత్నాన్ని నివారింప గలిగాను. తర్వాత ఆ సుందరి రత్నోద్భవుని భార్య సువృత్త అనీ, ఆ ముసలిది ఆమె పరిచారిక అని బోధపడింది.

మిత్రమా. ఈవిధంగా నేను నా తల్లి దండ్రు లిద్దరినీ కలుసుకో గలిగాను. వెంటనే వారికి నా సంగతి విన్నవిం చాను. వారు నన్ను చూసి మహానంద మగ్నులై కొంతసేపు తమ్ము తామే మరచిపోయారు. తర్వాత వారి నొక ఋషీ

శ్వరుని ఆశ్రమంలో నిల్పి నేను తిరిగి నిన్ను వెదకడానికి బయల్దేరాను. కొందరు సహాయకులను ప్రోగు చేసుకొని గారడీ విద్యలు ప్రదర్శిస్తూ దేశదేశాలు తిరిగి ఆఖరికి ఉజ్జయిని చేరుకొన్నాను. అక్కడ బంధుపాలుడనే వర్తకుని యింట బస చేసేను. అతని కూతురు బాలచంద్రిక మానసారుని కుమార్తెకు స్నేహితురాలు. రాజు కొడుకు దర్పసారుడు తపస్సుకి పోయాడు. పినతండ్రి కొడుకు చండవర్మ రాజ్యం నిర్వహిస్తున్నాడు. అతని సోదరుడు దారువర్మ యీ బాలచంద్రికను వరించదలచాడు. వాని బారినుండి తప్పించుకోదలచి బాలచంద్రిక నా సహాయ మపేక్షించింది. నేను ఆడ వేషంతో బాలచంద్రికతో పాటు దారువర్మ నివాసానికి వెళ్ళి అక్కడ ఏకాంతంగా అతణ్ణి చంపివేశాను. అది ఫలితంగా బాలచంద్రిక నన్ను వరించింది. బంధుపాలుడు శకునాలన్నీ చూసి యీ రోజున ఇక్కడికివస్తే మిత్ర దర్శనం అవుతుందని చెప్పాడు. ఆ మాటలు పాటించి వచ్చినందుకు తగిన ఫలం మీ దర్శనం. ''

అని చెప్పిన పుష్పోద్భవుని కథ రాజవాహన సోమదత్తు లిద్దరినీ హర్షాశ్చర్యమగ్నులుగా చేసింది. పిమ్మట వారందరూ కలసి అవంతీ నగరానికి పయనమై వెళ్ళారు.

అవంతి సుందరి కథ :—

వసంతోదయమయింది. సమస్త జీవులు నవోత్సాహంతో మదనోత్సవాలు నెరపుతున్నాయి. ఎటుచూసినా వికసించిన పువ్వులు, సువాసనాభరితమైన పిల్ల గాలులు,

కోకిలల కుహుకుహూలు, తుమ్మెదల ఝుంకృతులు—అంతటా ఆనందమే. అందరూ విలాసులే. ఆ రోజుల్లో అవంతిలో పుష్పోద్భవుని యింట బ్రాహ్మణ వేషంతో నివసిస్తున్నాడు రాజవాహనుడు. రాజు మానసారుని కుమార్తె అవంతి సుందరి ఒకనాడు ఉద్యానవనంలో విహరించబోయింది. బాలచంద్రిక కూడ ఆమెతో కలసి ఉద్యానవనానికి వెళ్ళింది. అక్కడ కొంతసేపు, కామదేవుని పూజించి, అవంతి సుందరి తనకు తగిన వరుని వరంగా కోరుకుంది. అదే సమయమున రాజవాహనుడు పుష్పోద్భవునితో కలసి ఉద్యానవనానికి వెళ్ళాడు. బాలచంద్రిక వీరిని చూసి నిరాటంకంగా వారి వద్దకు రావచ్చునని చెప్పి, అవంతి సుందరిని వారిద్దరికీ పరిచయం చేసింది. ఆ ముహూర్తబలమట్టిది. రాజవాహనుడు, అవంతి సుందరి ఒకరి నొకరు మనసా వరించారు. "సఖీ, ఈ బ్రాహ్మణ యువకుడు చతురశిల్పి, విద్యా వివేక యుతుడు, సమస్త శాస్త్రవేత్త. రత్న పరీక్షా నిపుణుడు. ఇతణ్ణి నీవెంతైనా ఆదరించవలసినదే" అని సాభిప్రాయంగా చెప్పిన బాలచంద్రిక పలుకులలో గల ఆంతర్యం అవంతి సుందరి గ్రహించింది. ఇంతలో రాజవాహనునికి ఏదో పూర్వస్మృతి తట్టినట్లయింది. గత జన్మలో అతడు శాంబుడనే రాజు, అప్పటి అతని భార్య యజ్ఞవతియె ఇప్పటి యీ అవంతి సుందరి. ఆమె కోర్కెపై ఆ జన్మలో అతడొక హంసమిథునాన్ని బంధించాడు. వాటి శాపం వలన వియోగం కలిగింది. ఈ జన్మలో కొంతకాలం బందీగా

ఉన్న తర్వాతగాని తిరిగి మేమిద్దరం కలుసుకోబోమని రాజ వాహనుడు తన పూర్వజన్మ వృత్తాంతమంతా కరతలామల కంగా గ్రహించాడు. ఆమెకా వృత్తాంతం చెప్పగా, ఆమెకు కూడ పూర్వ స్మృతి కలిగింది. వారి ప్రేమ మరింత గాఢ మయింది.

ఇంతలో రాణీగారు వస్తున్నారన్న సంగతి తెలిసి ఎక్కడివా రక్కడ తప్పుకొన్నారు. ఆ తర్వాత కొన్నాళ్ళ వరకు బాలచంద్రిక సహాయంతో రాజవాహనావంతి సుందరు లిరువురికీ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయి. ఇలా ఉండగా ఒకనాడా పట్నాని కొక గారడీవాడు వచ్చాడు. వాని కీర్తి విని రాజుగారు వాని గారడీ విద్యను రాజమహల్లో ప్రదర్శించమని ఆజ్ఞాపించారు. అదే తరుణ మని పుష్పోద్భవుడా గారడీ వానికి లంచమిచ్చి, రాజవాహ నావంతి సుందరుల వివాహానికి తోడ్పడమన్నాడు. వాడు సరేనని మాట ఇచ్చి రహస్యంగా రాజవాహనుణ్ణి తనతో పాటు కోటలోకి తీసుకొనిపోయాడు. అక్కడ తన విద్య ప్రదర్శిస్తూ రాజవాహనుడితో అవంతి సుందరికి వివాహం జరుగుతూన్నట్లు కూడ ఒక ఘట్టం ప్రదర్శించాడు. అందరూ గారడీ చూసి సంతసించారు. కాని నిజానికి అది సందుగా రాజవాహనుడు అవంతి సుందరి మహలులో ప్రవేశించాడు.

కొన్నాళ్ళ కీరహస్యం బయటపడింది. తక్షణమే చండవర్మ రాజవాహనుణ్ణి పట్టి జైల్లో వేయించాడు. కాని

అతని సౌందర్య సౌశీల్యాది గుణాలు చూసి, అవంతి సుందరి తల్లి దండ్రులు అతణ్ణి చంపకుండా కాపాడగలిగేరు. ఈలోగా చండవర్మ అంగదేశపురాజుపై దండెత్తి వెళ్ళాడు. ఆ రాజు నోడించి అతడా రాజు కూతురు అంబాలిక నపహరించాడు. తిరిగివచ్చి రాజవాహనుణ్ణి చంపబోయాడు. కాని అందుకని నియోగించిన ఏనుగు అతణ్ణి చంపడానికి బదులు అతని కాలికి కట్టిన సంకెళ్ళు ఊడదీసింది. ఈ ఘట్టం ఇట్లా జరుగుతూండగా ఎవరో వచ్చి చండవర్మను చంపినట్లు కలకలం పుట్టింది. ఈ గల్లంతులో రాజవాహనుడు బంధవిముక్తుడై బయటపడి, కత్తి పట్టుకొని చండవర్మ మందిరానికి వెళ్ళాడు. కాని అక్కడికిపోయి చూసేసరికి చండవర్మను చంపినవాడు తన మిత్రుడు అపహారవర్మ కాని మరొకడు కాడని తెలిసి అతణ్ణి చూడడానికి వెళ్ళాడు. అంబాలికతో పాటు కోటగుమ్మం దగ్గర అపహారవర్మ కనిపించాడు. రాజవాహనుని చూడగానే అతడు కత్తి పారేసి వచ్చి అతణ్ణి కౌగలించుకొన్నాడు. "మిత్రమా, చండవర్మపై దండెత్తిన వాణ్ణి నేనే. సింహవర్మకు కలిగిన అపకారానికిది ప్రతీకారం. నా మిత్రుడు ధనమిత్రుడా సింహవర్మకి అత్యంత ఆప్తుడు. అదిగాక మన మిత్రులందరూ ఇప్పుడు ధనమిత్రుని వద్దనే ఉన్నారు. రా" అని చెప్పి అపహారవర్మ రాజవాహనుణ్ణి కోట ఆవలకి తీసుకొనిపోయి ధనమిత్రుని సేనా శిబిరానికి చేర్చాడు. మిత్రులందరూ కలుసుకొని మహానంద మగ్నులయ్యారు. ఒకరికథ లొకరు మరొకరితో చెప్పుకొన్నారు.

రాజవాహనుడు, పుష్పోద్భవ, సోమదత్తుల కథలు మిగిలిన వారికి చెప్పాడు. అపహారవర్మ తన కథ నిలా చెప్పాడు.

అపహారవర్మ కథ :—

"మిత్రమా, నిన్ను వెదుకుతూ పోయి నేను గంగా తీరం చేరుకొన్నాను. అక్కడ నాకొక సాధువు కనిపించాడు. అంతకుముందు నేను మరీచి మహర్షి ఖ్యాతి ప్రఖ్యాతులు వినిఉండటంవల్ల యీ సాధువు కతని వృత్తాంతమేమైనా తెలుస్తుందేమో అని ఆశించాను. ఆ మహర్షి సహాయ్యాన్న నీ జాడ కనుక్కుందామని నా తలంపు. కాని నాకు కనిపించిన ఆ సాధువే మరీచి మహర్షి. అతడు చంపా నగరంలో ఉన్న కామ మంజరి అనే వేశ్యకు దాసుడయ్యాడు. ఆ వేశ్య తన అక్కతో పంతగించి, తన ప్రజ్ఞ ప్రదర్శించడానికిగాను యీ మహర్షిని తన వలలో వేసుకొని చివరకు మోసగించింది. అది ఫలితంగా మరీచి విరక్తుడై పూర్వ మహాత్వమంతా కోల్పోయి పునఃప్రియత్నంగా తపస్సు చేసుకొంటున్నాడు. కొన్నాళ్ళు చంపానగరంలో ఉంటే నీకు మేలు కలుగుతుందని అతడు చెప్పగా విని నేను చంపా నగరానికి బయల్దేరాను. దారిలో వసుపాలితుడనే జైన సన్యాసి ఒకడు కన్పించాడు. అతడుకూడ కామమంజరికి లొంగి దిగంబరుడై దిక్కుమాలిపోయినవాడే. ఈ ఇద్దరి చరిత్రలు విని నేను తగినంత జాగరూకతతో మెలగడానికి నిశ్చయించుకొని చంపా నగరం చేరుకొన్నాను.

చంపా నగరంలో ధనికులు హెచ్చు. వారందరూ లోభులే. వారిని లొంగదీయగల ఉపాయం చోరత్వం లేదా జూదం మాత్రమే. నేను నా నేర్చిన విద్య అంతా ఉపయోగించి కొందరు జూదగాళ్ళకి, దొంగలకి నాయకుణ్ణయాను. నా స్నేహితులలో విమర్దకుడనేవాడు మిక్కిలి విశ్వాసపాత్రుడు, కార్యకుశలుడున్నూ. అతనిద్వారా ఊరి విషయాలన్నీ ఎప్పటికప్పుడు గ్రహిస్తూ ఉండేవాణ్ణి.

ఒకనాటి రాత్రి నేను దొంగతనానికిపోయి కుబేరమిత్రుడనే ధనికుని యింటి పెరటిలో చేరాను. కాని అక్కడ నాకతని కుమార్తె కనిపించింది. ఆమెను అర్థపతి అనే ధనవంతుడైన దుర్మార్గునకిచ్చి పెళ్ళి చెయ్యాలని నిశ్చయించాడు కుబేరదత్తు. ఆమె ధనమిత్రుడనే యువకుని మనసా వరించింది. ఆ రాత్రి తను వరించిన ధనమిత్రునితో కలిసి ఎటో పారిపోదలచి ఆమె ఆ పెరటిలోకి వచ్చింది. నన్ను చూసి గాభరా పడింది. కాని నేనామె నాశ్వాసించి తోడుపడి ఎట్లాగో ఆమెను ధనమిత్రుని యింటికి చేర్చాను. వారిని ఊరు విడిచి పోవద్దనీ, కొద్ది రోజులాగితే అన్ని విషయాలు సానుకూలం కాగలవనీ, నా సహాయ్యమెంతైనా వారికి లభించగలదనీ ధైర్యం చెప్పి వచ్చాను. మరునాటి నుండి ఊళ్లో ధనమిత్రుని ప్రతిష్ఠ హెచ్చుయేటట్లు ప్రవాదులు పుట్టించాను. ఈలోగా నాకు కామమంజరి చెల్లెలు రాగమంజరితో స్నేహమయింది. ఆమెను నేను వివాహం

చేసుకోగోరి ఒక బంగారపు గారడీ గిన్నె కామమంజరికి లంచమిచ్చి ఆమెను ఒప్పించగలిగాను. తర్వాత నాకూ రాగమంజరికీ వివాహం జరిగింది. వివాహానంతరం తిరిగి నేను నా మిత్రుల సహాయంతో అర్ధపతిమీద ఒక నింద మోపి ఊళ్లో 'అతడు దొంగ' అని ప్రచారం చేయించాను. అతడు ధనమిత్రుని యింట బంగారు గిన్నె దొంగలించి కామ మంజరి కిచ్చినాడని ప్రవాదు పుట్టించాను. ఈమాట రాజు గారికి తెలిసి అతడు అర్ధపతిని ఊరు వెడల నడచాడు. కామ మంజరి విటులవద్దనుండి అన్యాయంగా ఆర్జించిన సొత్తు ఆమె చేతులతోటే తిరిగి అందరికీ పంచిపెట్టింది. అలా చేస్తే ఆ బంగారు గిన్నె ఇంకా బంగారం ఎక్కువగా యిస్తుందని ఆమెకు నమ్మకం. అంతాపోయి ఫకీరయిన తర్వాత ఆమెకు కారాగారమే ప్రాప్తించింది. ఈ విధంగా శత్రుబలమంతా అణిగిపోయింది. అప్పుడు ధనమిత్రుని మంచితనాన్ని మెచ్చు కొని కుబేరదత్తు తన కుమార్తె నతనికిచ్చి పెళ్ళి చేయడానికి ఒప్పుకున్నాడు. మొన్ననే పెళ్ళయింది. నిన్న సింహవర్మ పైకి చండవర్మ దండెత్తివచ్చి అతని కూతురి నపహరిం చాడు. నిజానికి సింహవర్మ కుమార్తెపై నేనుకూడ మనస్సు పెట్టుకున్నాను.

నా ఆశలకి విరుద్ధంగా చండవర్మ అంబాలిక నిక్క డికి తెచ్చాడనగానే నాకు కోపతాపా లాగలేదు. వెంటనే నేను నా మిత్రులందరితోటీ కలసి సింహవర్మకు సహాయ్యా

పడి యీ ఊరిపై దండెత్తివచ్చేలా చేసేను. నా చేతులతో నేనే చండవర్మను చంపి అంబాలికను విడిపించగలిగాను. మిగిలిన కథ అంతా నీకు తెలిసినదే'' అని అపహారవర్మ తన కథ ముగించాడు.

ఆ కథ విని మిత్రులంతా ఆశ్చర్య హర్షాలలో మునిగి అతనికి ధన్యవాదా లర్పించారు. 'ఇక నేముంది. మంచి ముహూర్తం చూసి అంబాలికకు అపహారవర్మకు వివాహం చెయ్యడమే మన ప్రథమ కర్తవ్యం' అని ధనమిత్రు డన్నాడు. 'రాజవాహనునికి అవంతి సుందరితో వివాహం కావలసి ఉందికదా! అన్నీ ఒకేసారి చేయవచ్చు' నన్నాడు సింహవర్మ. 'ఉపహారవర్మా! నీ కథ తెలియజేశావు కావు' అన్నాడు రాజవాహనుడు. వెంటనే ఉపహారవర్మ తన కథ నిలా చెప్పనారంభించేడు.

ఉపహారవర్మ కథ :—

''రాజకుమారా, నేను నిన్ను వెదకుతూ విదేహ రాజ్యానికి బయల్దేరాను. రాజధానియైన మిథిలా నగరం సమీపించేసరికి అక్కడ నాకొక ముసలిది కనిపించింది. ఆమె నన్ను చూసి బిగ్గరగా ఏడ్వసాగింది. కారణమేమంటూ నేను ప్రశ్నించగా ఆమె ఈ రీతిగా చెప్పింది. ''మిథిల రాజు ప్రహారవర్మ మగధీశుడైన రాజహంసునికి పరమ మిత్రుడు. వారి రాణులైన ప్రియంవదా వసుమతులు నాకాప్తులైన మిత్రులు. మాలవ రాజుతో పోరి ఓడిపోయి

రాజహంసు డడవుల పాలయ్యాడని తెలిసి సహాయార్థమై వెళ్ళిన ప్రహారవర్మ, తన రాజ్యాన్ని పోగొట్టుకోనడమే కాక దారిలో భిల్లుల చేతిలో పడ్డాడు. ఆ సమయంలో అతని కుమారుడు నావద్ద ఉండేవాడు. మరొక కుమారుడు నా కుమార్తె వద్ద ఉండేవాడు. ఆపిల్లలిద్దరూ భిల్లుల పాలై య్యారు. అటుచూస్తే ప్రహారవర్మ, తన రాణి ప్రియం వదతో కూడ శత్రువుల చేతిలో బందీగా ఉన్నాడు. నా కూతురు విధిలేక శత్రురాజుల యింట దాసీగా కుదురు కొని జీవిస్తూంది." అని చెప్పి ఆమె వలవల ఏడ్చి మిగత కథ చెప్పలేకపోయింది. ఈ చెప్పిన దానినిబట్టి నాకు ప్రహా రవర్మ ప్రియంవదలు నా తల్లిదండ్రులే అనిన్నీ, వారిప్పుడు శత్రువులచేత ఖైదీలుగా చేయబడ్డారనీ తెలిసింది. "అమ్మా, నేను ప్రహారవర్మ కుమారుణ్ణి. పేరు ఉపహారవర్మ, మా అన్న అపహారవర్మ కూడ నాతోటే ఉండేవాడు. మేమంతా రాజహంసుని పోషణలో పెరిగి పెద్దవాళ్ళ మయ్యాము. ఇప్పుడు మా తల్లిదండ్రులను విడిపించడానికి నేనెంతైనా ప్రయత్నిస్తాను. నువ్వు మరి దుఃఖించకు" అని ఆమెకు ధైర్యం చెప్పాను.

ఆమె నన్ను నగరంలోకి తీసుకొని వెళ్ళింది. అప్పటి రాజు వికటవర్మ. అతని భార్య కల్పసుందరివద్ద యీ ముసలి దాని కూతురు పుష్పరిక దాసీగా ఉంది. ముసలిది నన్ను తన కూతురుతో పరిచయం చేసింది. సరి. నేను ఆ పరిచ యాన్ని వినియోగించుకొని ఆమె ద్వారా కల్పసుందరి

మనస్సు వికటవర్మపై విరిగిపోయే లాగున చెయ్యడానికి ప్రయత్నించాను. ముసలిది కూడ నాకీ కార్యంలో సహాయ్య పడింది. పర స్త్రీని వశంచేసుకోవడమా ? ఇది ధర్మమేనా ? అనే ప్రశ్న కొంతగా మొదట్లో నన్ను బాధించింది. కాని తల్లి దండ్రులను విడిపించడానికి మరొక ఉపాయం లేదు. ఉత్తమ కార్యానికని చేసిన ప్రయత్నంలో సాధనోపాయాల మంచి చెడ్డలు ముఖ్యంకాదు. పరిణామమే ముఖ్యమని నా ఆత్మ చెప్పింది. నేను ధృడనిశ్చయంతో ప్రయత్నించాను. చివరికి నా ప్రయత్నం ఫలించింది. నేను కల్పసుందరిని కలుసుకోగలిగాను. నేనామె చేతికి నా చిత్రాన్ని ఇచ్చి 'నీవీ చిత్రాన్ని రాజుకి చూపించి, ఇటువంటి సుందరమైన శరీరం మీకు లభిస్తే వద్దంటారా ?' అని అడగమన్నాను. అతడు సరదాపడి సరే అంటే మంత్రి సామంత పురోహితాదులందరికీ ఆ చిత్రాన్ని చూపించి అటువంటి శరీరం లభించడం కోసమని యజ్ఞం చేయడానికి ప్రోత్సహించమన్నాను. ఆమె నేను చెప్పిన ప్రకారం చేసింది. నాల్గు రోజులలో వికటవర్మ యజ్ఞాని కాయత్తుడయ్యాడు. అమావాస్యనాటి రాత్రి యజ్ఞం ప్రారంభమయింది. నేను కల్పసుందరి వేషం ధరించాను. ఆ రాత్రి దీక్షావశుడైన వికటవర్మకు నా పొత్తి సరిగా దొరకలేదు. "మహారాజా, యీ యజ్ఞాంతంలో మీరు దివ్యరూపం ధరిస్తారు. కాని నన్ను మరిచిపోతారేమో?" అని తియ్యారిస్తూ అతనితో మాటాడి నమ్మికకోసమని

అతని మనస్సులో ఉండే కొన్ని ముఖ్య రహస్యాలు చెప్ప మన్నాను. అతడు సరేనని ప్రహారవర్మను చంపాలనీ, పుండ్రదేశం జయించాలనీ, ఒక అరబ్బీ వర్తకుని దగ్గర ఉన్న అమూల్య రత్నాన్ని గ్రహించాలనీ, అనంతసిరుడనే ప్రహార వర్మ మిత్రుణ్ణి చంపాలనీ తన మనోభీష్టాలని చెప్పాడు. ఇది వినడమే తడవుగా నేనాతనిని ఏకాంతంగా నిల్పి, ఆ చీకట్లో కత్తితో పొడిచి చంపివేశాను. తర్వాత ఆ శవాన్ని చిత్రవధచేసి అగ్నికాహుతి చేశాను. నా ఆడ వేషం విడిచి, యథారూపంతో బయటపడ్డాను.

మొదట నా చిత్రాన్ని చూసినవారు ఇప్పుడు నన్ను చూసి రూపం మారిపోయిన వికటవర్మగానే నన్ను భావిం చారు. నేను మర్నాడు కొలువు తీర్చాను. మా తండ్రిగారిని విడిపించి అతని రాజ్యం అతని కిప్పించాను. నేను యువ రాజుగా ఉంటానన్నాను. తర్వాత నా రహస్యం తెలిసి మా తల్లి దండ్రులెంతో సంతోషించారు. ఇంతలోగా సింహ వర్మవద్దనుండి సహాయార్థమై లేఖ వచ్చింది. నేను సైన్యాలు తీసుకొని అతనిపక్షాన చండవర్మతో పోరాడడానికి వచ్చాను. మొదట మా అన్న కనిపించాడు. పిదప మిత్రులూ, మీరూ కూడ నాకిక్కడ దొరికారు. ఈ మిగిలిన మిత్రుల కథలు కూడా వినాలని ఉంది.” అని తన కథ చాలించాడు ఉప హారవర్మ.

అర్థపాలుని కథ !—

"యువరాజా, నే ననేక దేశాలు తిరిగి కాశీ చేరు కొన్నాను. అక్కడ నాకో మోటుమనిషి కనిపించాడు. అతడు గొప్ప వస్తాదు. పౌరుషం కలవాడు. ఏపని చెప్పినా సునాయాసంగా చేయగల ధీరుడు. కాని వాని కళ్ళు చూస్తే ఏదో దుఃఖంలో మునిగి సంతతమూ కన్నీళ్లు కార్చినవాడిలా కనిపిస్తాడు. దానికి హేతువేమా అని నేను కుతూహలపడి కనుక్కొన్నాను. తానొక ఊరికి నాయకుని కొడుకుననీ, తన పేరు పూర్ణభద్రుడనీ, వృత్త్యా దొంగ అనీ, ఒకసారి కాశీలో దొంగతనంచేసి పట్టుబడ్డాననీ, తనని చంపడానికి ఒక ఏను గును వదిలేరనీ, కాని తానా ఏనుగును ధిక్కరించి ఎదిరిం చాననీ, బెదిరిపోయి ఏనుగు వెనక్కి మళ్ళిపోయిందనీ, అది చూసి మంత్రి కామపాలుడు అతణ్ణి మెచ్చుకొన్నాడనీ చెప్పాడు. 'నీవీ దొంగతనం మానేస్తే నిన్ను విడిపించి ఉద్ధ రిస్తానని' కామపాలు డతనితో చెప్పాడట. ఆ మాటలు విని అతని మనస్సు మారి దొంగతనంమాని సజ్జనుడై ఉండడా నికి అంగీకరించాడట. కామపాలుడు తన మాట ప్రకారం అతణ్ణి విడిపించి సగౌరవంగా తనవద్ద ఉంచుకొన్నాడు.

ఒకనాడు ఇతనికి కామపాలుని పూర్వ వృత్తాంతం విన వేడుకైంది. దానిమీాద అతడు తన కథ ఇట్లా చెప్పాడు. "పాటలీపుత్రపు మంత్రి ధర్మపాలుడనే ఆయనకు సుమిత్రుడు కామపాలుడు అని ఇద్దరు కొడుకులు. ఆ కామ

పాలుడే నేను. అయితే చిన్నప్పుడే నేనిల్లు విడిచి ఈ కాశీ చేరుకొన్నాను. ఇక్కడ రాజైన చండసింహుని కూతురు కాంతిమతితో నాకు సంబంధం ఏర్పడింది. ఒక కొడుకు కూడ పుట్టేడు. ఈ రహస్యం తెలిసిపోతుందనే భయంతో ఆ పిల్లవాణ్ణి శ్మశానంలో పారవేయించాను. కాని నా రహస్యం దాగలేదు. ప్రాణభీతితో పారిపోయి నేనో అడవిలో చేరుకొన్నాను. అక్కడొక స్త్రీ ఏడుస్తూ కనిపించింది. ఆమె తనపేరు తారావళి అనీ, ఆమె యక్షిణీ అనీ, కాశీ శ్మశాన వాటికలో ఆమెకో బిడ్డడు దొరికాడనీ, అతని నామె రాజహంసుని రాణి వసుమతి కప్పగించినదనీ చెప్తే విని లోలోపల కొంత నెమ్మదిపడ్డాను. ఆమె కాంతిమతికి జన్మాంతర స్నేహితురాలట. తాను కూడ వెనుకటి జన్మలలో నాభార్యయేనట. తనను స్వీకరించినట్లయితే ఆ అడవిలో కులాసాగా ఉండవచ్చునని చెప్పగా విని నే నంగీకరించాను. వెంటనే ఆమె తన విద్యా ప్రభావంవల్ల అక్కడో మేడ కట్టింది. కొన్నాళ్ళ తర్వాత ఆమె సహాయంతో నేను చండసింహుని గెల్చి, కాంతిమతిని పెళ్ళాడేను. చండసింహుడు లొంగిపోయి నన్నే రాజ్యానికి ఉత్తరాధికారిగా నియోగించాడు. అప్పటినుండి నేను మంత్రిగా ఉంటున్నాను.'' అని కామపాలుడు చెప్పాడు. ఇది చెప్పి తిరిగి ఆ వ్యక్తి ఇలా అన్నాడు. ''చండసింహుడు గతించాడు తరువాత కూడ కామపాలుడు రాజు కాలేదు. సింహఘో

షుడు రాజయ్యేడు. ఒకానొక కోపంచేత తారావళి కూడ అతణ్ణి విడిచిపోయింది. సింహఘోషుడు అతణ్ణి జైలులో వేయించాడు. ఈ రోజున కామపాలుని వధ్యస్థలానికి తీసుకొనిపోతారు. అందుకని నేను దుఃఖిస్తున్నాను" అని ఆతడు చెప్పగా విని నేను చాలా విచారించాను. అతడు చెప్పిన దానిమీద కామపాలుడు మా తండ్రి అని నాకు తెలిసిపోయింది. నేనా వ్యక్తికి నా పరిచయం చెప్పి అతని సహాయ్యంతో ముందుగా మా తల్లి కాంతిమతిని కలుసుకొన్నాను. ఆమెను సహగమనం చెయ్యడానికని తయ్యారు కమ్మని చెప్పి నటించమన్నాను. ఊరవతల వధ్యస్థానంలో నే ఆమెకని చితి పేర్చారు. వధ్యస్థానంలోనికి కామపాలుని తెచ్చారు. ఈలోగా నేనొక పామును సంగ్రహించి ఆ వధ్యస్థానానికి చేరుకొన్నాను. అక్కడ జన సమ్మర్దంలో నిల్చి ఆ పామును మా తండ్రిగారి మీదికి విసిరాను. ఆ పామతనని కరచింది. వెంటనే రాజభటులు తత్తరపడ్డారు. ప్రజలు గల్లంతు చేశారు. ప్రయత్నాలు భగ్నమయాయి. కథ అడ్డం తిరిగింది. ఆ సందట్లో ఎలాగో సందు చేసుకొని నేను మా తండ్రిగారి వద్దకు పోయి, పాము కాటుకు మందు పెట్టి, కొంతవరకు స్పృహ లేక పడిఉండి, చనిపోయిన వానివలె నటించమని ఆయన చెవిలో చెప్పాను. అతడు చనిపోయినట్టుగా అందరూ నిశ్చయించారు. కాంతిమతిని సతి కమ్మని రాజాజ్ఞాపించాడు. అందరూ ఎక్కడి వారక్కడికే మళ్ళిపోయారు.

పూర్ణభద్రుని సాయంతో నేను కామపాలుని సురక్షిత స్థానానికి చేర్చగలిగాను. తర్వాత కాంతిమతిని కూడ రహస్యంగా అక్కడికే చేర్చాను. కొన్నాళ్ళు రహస్యంగా తల దాచుకొంటూ మా తండ్రిగారు తిరిగి కొందరు సహాయకులను పోగుచేసుకో గలిగారు. నేనీ లోపుగా మా అడవిలో నుండి రాజమహలుకి ఒక సొరంగం త్రవ్వాను. కాని ఆ సొరంగం రాజుగారి బసలోకి కాకుండా అతని అన్న కూతురు మణికర్ణిక మేడలోకి పోయింది. నేనామెతో స్నేహంచేసి, ఆమె సహాయంతో రాజుగారి మేడలో ప్రవేశించాను. అతడు నిద్రపోతున్నాడు. అతణ్ణి వెంటనే బంధించాను. తర్వాత రాజ్యం కైవశం చేసుకొన్నాము. మా తండ్రిగారు తిరిగి రాజయ్యారు. నాకు మణికర్ణికతో పెళ్ళి అయింది. ఇంతలో సింహవర్మనుండి వర్తమానం రాగానే సహాయార్థమై యిక్కడికి వచ్చి మీ అందరినీ కలుసుకో గలిగాను.'' అని అర్థపాలుడు తన వృత్తాంతం చెప్పి ముగించాడు. రాజవాహను డిదివిని చాలా సంతోషించాడు. ''అన్నీ బాగున్నాయి. కాని సింహఘోషుని మాత్రం ఇంకా చెరలో ఉంచడం బాగులేదు. అతణ్ణి విడిపించి నావద్దకు పంపించు'' అని రాజవాహను డతని కాజ్ఞాపించాడు. తర్వాత ప్రమతి తన కథ నిలా ప్రారంభించాడు.

ప్రమతి కథ :—

''మహారాజా, నిన్ను వెదకుతూ పోయి నేను వింధ్యాటవి చేరుకొన్నాను. అక్కడో దగ్గర విశ్రమించగా నాకొక

స్వప్నం వచ్చింది. అందులో ఒక చక్కని కన్యక నాకు కనిపించింది. మే మొకరి నొకరు వరించాము. కాని తెలివి వచ్చేసరికి నేనొక పాడుపడిన జాగాలో పడి ఉన్నాను. నా కెదురుగా ఒక బక్కచిక్కిన కాంతి నిల్చి ఉంది. ఆమె నన్ను పుత్రివాత్సల్యంతో తీసి కౌగలించుకొని ఇలా చెప్పింది. "నాయనా, నీవు నన్నెరుగవు. నేను తారావళి అనే యక్షకాంతను. కామపాలుని అర్ధాంగిని. ఒకానొక శాపంచేత భర్తను విడిచి యిన్నాళ్ళూ ఈ అడవిలో తిరుగుతున్నాను. నా శాపావధి పూర్తి అయింది. నేనిప్పుడు కామపాలుని వద్దకి పోతున్నాను. త్రోవలో నిన్ను చూసి యిక్కడకు వచ్చాను. ఇక్కడికి శ్రావస్తీ నగరం చేరువ. ఆవూరు పోతే నీకు శుభం కలుగుతుంది." అని చెప్పి ఆమె అంతర్ధానమయింది. నేనాశ్చర్యపోతూ ఆమె చెప్పిన ప్రకారం శ్రావస్తికి బయల్దేరాను. దారిలో నాకొక బ్రాహ్మణునితో బద్ధ సఖ్యం కలిగింది. అవసరమైనప్పుడు సకల విధ సహాయమూ చెయ్యడాని కంగీకరించి మాట యిచ్చి ఆ బ్రాహ్మణుడు నన్ను శ్రావస్తికి పంపాడు.

ఆ నగర బహిరంగోద్యానంలో నేను విశ్రమించాను. నిద్రపోయి లేచేసరికి ఒక దాసి తన చేతిలో ఉన్న చిత్రంతో నా రూపాన్ని సరిపోలుస్తూంది. ఆమెను పిల్చి, కనుక్కోగా, ఆమె ఆ రాజు కూతురు నవమల్లికకు ఆంతరంగిక సఖి అని తెలిసింది. నవమల్లిక నన్ను స్వప్నంలో చూసి వరించింది.

సరేనని నేనా చిత్రం ప్రక్క నాకు స్వర్గంలో కనుపించిన సుందరిని చిత్రించాను. అది సరీగా నవమల్లిక చిత్రమేనని చెప్పి దాసి ఆశ్చర్యపోయింది. అందుమీద రాణి వాసం లోకి ప్రవేశించే ఉపాయమాలోచిస్తానని ఆమెకు చెప్పి పంపించి, నేను తిరిగి నా బ్రాహ్మణ మిత్రుని వద్దకు వచ్చి జరిగినదంతా అతనికి విన్నవించాను. అతడు నన్ను తన కుమార్తెగా వేషం వేయించి రాజదర్బారుకి తీసుకొని వెళ్ళాడు. తాను కాశీవెళ్లి వచ్చేదాకా నన్నా రాణి వాసంలో ఉంచేలా ఏర్పాటు చేశాడు. నేను రాణివాసం చేరుకొని నవమల్లికతో యథేచ్ఛగా సుఖిస్తూ కొన్నాళ్ళు న్నాను.

తర్వాత ఉన్నట్లుండి ఒకనాడు రాణివాసంలో నుండి తప్పించుకొని బ్రాహ్మడి దగ్గరకు వచ్చాను. ఈసారి అతడు నన్ను తీసుకొని రాజుగారి దగ్గరకు వచ్చి ఇలా చెప్పాడు. "మహారాజా, నీ దయవల్ల నా యాత్ర నిరాటంకంగా కొన సాగింది. ఈ కుర్రవాడు కూడ లభించాడు. ఇతనికి నా కూతురునిచ్చి పెళ్లి చెయ్యాలని నా తలంపు." అని చెప్పి తన కుమార్తెను రాణివాసంలో నుంచి పిలిపించమ న్నాడు. కాని ఆ కుమార్తె ఎంత వెదికినా కనపడలేదు. రాజుకేమి చేయవలెనో తోచలేదు. దానిమీద బ్రాహ్మ ణుడు "నా కుమార్తెకు మారుగా నీ కుమార్తె నితనికిచ్చి నట్లయితే నేను సంతోషిస్తాను." అని చెప్పాడు. రాజు

వేరే గత్యంతరం లేక ఆ మాట ఒప్పుకొని నవమల్లికను నాకిచ్చి వివాహం చేశాడు. రాజ్యం కూడ నాకే లభించింది. ఇంతలో సింహవర్మ వృత్తాంతం విని సహాయార్థం ససైన్యంగా వచ్చి మిమ్మందరినీ కలుసుకో గలిగా నిక్కడ'' అని అతడు తన కథ ముగించాడు.

''నీవు చాలా అదృష్టవంతుడవు ప్రమతీ'' అని మెచ్చుకొంటూ రాజవాహనుడు మిత్రగుప్త మంత్రగుప్తుల వంక తిరిగి మీ వృత్తాంతాలు కూడ చెప్పవలసిందని కోరాడు. దానిమీద మిత్రగుప్తు డీ విధంగా చెప్పసాగాడు.

మిత్రగుప్తుని కథ :—

''ఆర్యా, నేను నిన్ను వెదకుతూ దామలిప్త మనే పట్టణం చేరుకొన్నాను. అక్కడో ఉద్యానవనంలో ఒక వ్యక్తి విచారకరంగా వీణ వాయిస్తూ కూర్చొన్నాడు. నేనా తని ప్రక్కనే పోయి కూర్చొన్నాను. కొంత సేపటికి అవకాశం చూసుకొని ఆయన ఆవిధంగా దీనుడై ఉండడానికి కారణమడిగేను. ''అయ్యా, ఈ దేశపు రాజు తుంగధన్వునికి సంతతిలేదు. అతడీ దగ్గర మందిరంలో సంతానార్థియై పర దేవత నుపాశించగా ఒకనాడు దేవి స్వప్నంలో కనిపించి అతనికో కూతురు, కొడుకూ పుడతారని చెప్పింది. బావ మరది రాజుగా ఉంటే ఇతనికొర కాతని ఆశ్రయంలో తల దాచుకుంటాడని కూడ దేవి చెప్పింది. ''ఆ పిల్ల ఏడేళ్ళ వయస్సు వచ్చినది లగాయితూ రోజూ నన్నారాధించాలి''

అని చెప్పిన దేవి మాటల ప్రకారం మా రాజుకి సంతతి కలిగింది. పిల్ల పేరు కందుకవతి. పిల్లడు భీమధన్వుడు. కందుకవతి స్నేహితురాలు చంద్రసేన అనే పిల్లను నేను వరించాను. కాని భీమధన్వుడు కూడ ఆమెనే కోరుతున్నాడు. వాడు తుంటరి. దొంగ కూడాను."

అని ఇంకా అతడేమో చెప్పబోయేలోగా ఒక యువతి అక్కడికి వచ్చింది. ఆమెయే చంద్రసేన. వారి అన్యోన్య ప్రేమ చూసి వారికెలాగైనా సహాయ్యం చెయ్యాలని నా మనస్సులో బుద్ధి పుట్టింది. తర్వాత మేమంతా దేవాలయంలో నాట్యం చేస్తూన్న రాజకుమారిని చూడబోయేము. రాజకుమారి సౌందర్యం చూసి నేను ముగ్ధుడనయాను. పూజానంతరం కొంతసేపు కందుక క్రీడ నెరపి కందుకవతి చెలికత్తెలతో కలసి అంతఃపురానికి వెళ్ళిపోయింది. ఇంతలో భీమధన్వుని పరిచారకులు వచ్చి నన్ను బంధించి సముద్రంలో పారవేశారు. కొందరు నావికుల దయ చేత ఎలాగో బ్రతికి బయటపడ్డాను. కాని ఆ నావికులు నన్ను బానిసగా అమ్మబోయారు. ఇంతలో మరొక ఓడ మా ఓడపైకి దాడి వచ్చింది. నేను నా పరాక్రమం చూపి మా నావికులకు సహాయపడి వచ్చిన ఓడలో గల వారి నోడించి బందీలుగా చేయించాను. కాని ఆశ్చర్య మేమంటే ఆ ఓడ నాయకుడు భీమధన్వుడే. కొంత సేపటికి బందీలతో మా ఓడ ఒక ద్వీపం చేరుకొంది. నావికులు నన్ను గౌర

వంగా చూడసాగేరు. కాని ఒడ్డున దిగినదే తడవుగా నన్నో బ్రహ్మరాక్షసు డడ్డగించాడు. వాడు నన్నో కొన్ని ప్రశ్న లడిగాడు.

"జగత్తులో క్రూరతరమైనదేది?"

"ఆడదాని మనస్సు"

"గృహస్థుడు కోరేదేమిటి?"

"గుణవంతురాలైన భార్య."

"కామ మంటే ఏమిటి?"

"ఒక మనోవికారం."

"కఠిన కార్యాన్ని సాధించే శక్తి ఏది?"

"బుద్ధి బలం."

అని చెప్పిన నా సమాధానాలు ఆ బ్రహ్మరాక్షసునికి చాలా నచ్చాయి. ఇంతలో మరో రాక్షసుడో యువతిని తీసుకొని పారిపోతూ కన్పించాడు. నా ప్రార్థనపై బ్రహ్మ రాక్షసుడా రాక్షసుని అడ్డగించాడు. ఆ పోరాటంలో వారి ద్దరు మరణించగా ఆ యువతి నాపరమయింది. చూడబోతే ఆమె నేను వలచిన కందుకవతి! ఆమెను తీసుకొని తిరిగి అనుకూల వాతావరణంలో పడవలు నడిపించి దామలిప్తం చేరుకున్నాను.

ఊళ్లో కల్లోలంగా ఉంది. రాజూ రాణీ తమ పిల్లల కోసమని దుఃఖించి ప్రాయోపవేశం చేస్తున్నారు. ఆ సమ యంలో వెళ్ళి వారికి కందుకవతిని భీమధన్వుని కూడ అప్ప

గించేను. వారు బ్రహ్మానంద భరితులై కృతజ్ఞతతో నాకు కందుకవతి నిచ్చి పెళ్ళిచేశారు. రాజ్యం కూడ నాకే ఇచ్చారు. చంద్రసేనకు వైణికునితో వివాహం చేయించాను. ఇంతలో సింహవర్మనుండి సహాయార్థమై పత్రం రాగానే సైన్యం తీసుకొని ఇక్కడికి వచ్చి మిమ్మందరినీ కలుసుకో గలిగాను.'' అని మిత్రగుప్తుడు తన కథ చాలించాడు. వెంటనే మంత్రిగుప్తుడు తన వృత్తాంతం ఈ విధంగా చెప్ప నారంభించాడు.

మంత్రగుప్తుని కథ ;—

''మిత్రమా, నీకోసమని నేను తూర్పు దిక్కుగా పోయి కళింగ దేశం చేరుకొన్నాను. అక్కడ ఒక శ్మసానంలో ఒక రాత్రి విశ్రమించాను. నేను లేచే సరికి ఎవరో ఒక నౌకరు ఒక దాసి నాకు కొంత దూరంలో పోతూ కనిపించారు. వారి ననుసరించి నడిచాను. వారొక అఘోర పంథీ సాధువును గూర్చి మాట్లాడుకొంటూ అతడున్న ఒక పాడుపడిన దేవాలయానికి త్రోవదీశారు. నేను కూడ వారిని వెన్నాడి వెళ్ళి అక్కడ చేరుకొన్నాను. ఆ సాధువు అభిచార హోమాలు చేస్తున్నాడు. నౌకరును చూసి 'కళింగ రాజ కుమార్తెను మోసుకొనిరా' అని పంపాడు. అయిదు నిముషాలలో ఆ నౌకరు రాజకన్యను తెచ్చి ఆతనిముందు నిల్పాడు. నా కళ్ళు నేనే నమ్మలేనంతలోగా ఆ సాధువా మెను కాళికి బలి ఇవ్వబోయేడు. తటాలున వెనుకనుండి వాని

మీదికి ఉరికి వాని కత్తితోటే వానిని నేను సంహరించి రాజకన్యను కాపాడాను. ఆ నౌకరు నాకు నమస్కరించి 'మహాత్మా, వీనిని చంపి నీవు లోకోపకారం చేశావు. నేనొక రాక్షసుణ్ణి. ఇకముందు నీవేది కోరితే అది చేస్తాను' అని చెప్పాడు. రాజకన్యను అంతఃపురంలో దించిరమ్మని వాని కాజ్ఞాపించాను. కాని ఆమె నేను లేనిదే తాను వెళ్ళనంది. సరేనని నేను కూడ ఆమెతో బయల్దేరాను. క్షణంలో ఆ రాక్షసుడు మమ్మిద్దరనూ రాజమందిరంలో చేర్చాడు. అక్కడ కొన్నాళ్ళు నేనామెతో సుఖించాను.

ఇంతలో ఆంధ్రదేశపు రాజు కళింగపై దండెత్తి వచ్చాడు. ఆ యుద్ధంలో కళింగరాజు ఓడిపోయేడు. రాజును, రాణీని, రాజకుమార్తెను కూడ బంధించి ఆంధ్రదేశం తీసుకొనిపోయారు. నేనేమి చేయడానికి తోచక వెర్రివానివలె కొన్నాళ్ళు తిరిగి ఎట్టకేలకి ఆంధ్రదేశపు రాజధాని చేరుకొన్నాను. అక్కడ ఒక సత్రంలో దిగి ఉండగా రాజైన జయపాలుడు కళింగరాజ కన్యక కనకలేఖను పెళ్ళాడదలచేడనీ, కాని కనకలేఖ నొక భూతమేదో ఆవేశించి యీ పెళ్ళి కాటంకం కలిగిస్తూందని ఊళ్లో చెప్పుకొంటూన్న వింతలు విన్నాను. అదే తగిన సమయమని యుక్తిపన్ని నేనొక పదిమంది శిష్యులను సంగ్రహించి యోగిరాజు వేషంతో నగరంలో నా ప్రసిద్ధిని వ్యాపింపజేసుకొన్నాను. ఆ ప్రసిద్ధి విని రాజు నన్నా రాజకుమార్తెకు గల భూత బాధను నివా

రింప జేయమన్నాడు. నేనందు కంగీకరించి నలభై రోజు లత నిని దీక్షలో ఉండి ఆ మర్నాడు ఊరావల ఒక యోజనం దూరంలో ఉన్న చెరువులో మునిగి లేచి రమ్మనమని చెప్పాను. అలా చేస్తే నీ రూపుమారి నిన్ను చూడగానే భూతం పలాయనం చేసి రాజకుమార్తె నీకు వశురాలవు తుందని చెప్పాను. అతడు సరేనని ఒప్పుకొని దీక్ష వహిం చాడు. నేను కొన్నాళ్ళయాక దేశాంతరం పోయినట్లు పుకారు పుట్టించి, ముందుగానే వెళ్ళి రాజు వచ్చి మునుగ బోయే చెర్లో దాగొన్నాను. రాజు వచ్చి ఆ చెరువులో మునిగినదే తడవుగా అతణ్ణి నీటిలోపలి కీడ్చి గొంతు పిసికి చంపి నేను బయటకు వచ్చాను. మారురూపంతో వచ్చిన రాజుగా నన్ను మంత్రులు చాలా గౌరవంగా తీసుకొని వెళ్ళి దర్బారు చేశారు. అదే రోజున కళింగరాజును రాణిని చెర నుండి విడిపించి నమ్మకస్తురాలైన దాసీదానిచేత కనక లేఖకు నా ఉదంతమంతా తెలియజేసేను.

ఒక మంచి ముహూర్తాన నాకు కనక లేఖకు వివాహం జరిగి తత్ఫలితంగా నాకు ఆంధ్ర కళింగ రాజ్యాలు రెండిటికీ పట్టాభిషేకం జరిగింది. ఇంతలో సింహవర్మ వార్త విని యిటువచ్చి ఇక్కడ మిమ్మందరినీ చూడగలిగేను." అని మంత్రగుప్తుడు తన వృత్తాంతం ముగించాడు. "విశ్రుతా, ఇక నీ వొక్కడవే మిగిలేవు. నీ కథ కూడ చెప్పు" అన్నాడు రాజవాహనుడు విశ్రుతునితో. సరేనని అతడిలా చెప్పనారంభించేడు.

విశ్రుతుని కథ :—

"మిమ్మల్ని వెదకుతూ పోయి నేను వింధ్యాటవిలో ఒక పాడు నూతివద్దకి చేరాను. అక్కడ నూతిలో దిగి వెలుపలికి రాలేక బాధపడుతూన్న ఒక ముసలివాణ్ణి రక్షించి ఆతనికోసమని బెంబేలుపడి ఏడుస్తూన్న ఓ కుర్రవాణ్ణి సంతోషపెట్ట గలిగాను. తర్వాత ఆ ముసలివాడు నాతో ఇలా చెప్పాడు. "అయ్యా, యీ కుర్రవాడు విదర్భ రాజకుమారుడు. ఇతని తండ్రి అనంతవర్మ భోగలాలసుడై ప్రమత్తుడై ఉండగా శత్రురాజైన అశ్మకి రాజాతని నెదిరించి సంహరించాడు. మహారాణి, రాజకుమార్తె మంజువాదిని, కోటలో చిక్కిపోయారు. కోట శత్రువుల వశమయింది. ఈ రాజకుమారు నెట్లో కోట తప్పించి వృద్ధమంత్రి నాకప్పగించి సురక్షితస్థానానికి చేర్చమన్నాడు. నేను మిమ్మల్ని కార్యంలో సహాయ మపేక్షించి వేడుకొంటున్నా' నన్నాడు. నేనతని మాటకు మారుగా నా సహాయమిస్తానని వాగ్దానం చేశాను.

ఇంతలో అదే అడవిలో గల కొందరు బోయవారి వల్ల చండవర్మ అన్న ప్రచండవర్మ విదర్భకు ససైన్యంగా వెళ్తూన్నట్లు తెలిసింది. అదిగాక అనంతవర్మ సోదరుడు మిత్రవర్మ ప్రస్తుతం విదర్భ నాక్రమించినట్లు కూడ వర్తమాన మందింది. నేనా బోయవారి మూక నొక దానిని నాకు సహాయ సైన్యంగా చేర్చుకొని విదర్భ చేరుకొన్నాను.

రహస్యంగా మిత్రవర్మను హత్య చేయించి, గారడీ విద్య
ప్రదర్శిస్తూ సమయం కనిపెట్టి ప్రహారవర్మను కూడ సంహ
రించాను.

తర్వాత రాణికి ఆమె కుమారుని అప్పజెప్పి, వృద్ధ
మంత్రి సహాయంతో సేనా సంచయంచేసి, అశ్మక రాజును
బాహాటంగానే ఎదిరించాను. ఈలోగా శత్రుపక్షంలో
మిత్రభేదం కలిగించి నా కార్యాన్ని సుగమం చేసుకొ
న్నాను. శత్రుక్షయం చేసి అనంతవర్మ సింహాసనంపై అతని
కుమారుడు భాస్కరవర్మను నిలుపగలిగాను.

ఇంత జేసినందుకు మారుగా కృతజ్ఞత తెలుపుతూ
రాణి తన కమార్తె మంజువాదినిని నాకిచ్చి వివాహం
చేయించింది. భాస్కరవర్మ చిన్నవాడుగదా అని అక్కడే
కొన్నాళ్ళుండి రాజ్యాంగాన్ని దిద్దడంలో అతనికి తోడ్ప
డుతూ వచ్చాను. ఇంతలో సింహవర్మ వర్తమానం విని
సహాయార్థమై యిక్కడికి వచ్చి మీ దర్శనభాగ్యం పొందగ
లిగాను" అని విశ్రుతుడు తన కథ చాలించాడు.

మిత్రులొకరిని మించి ఒకరు తమ ప్రజ్ఞా ప్రభావాల
వల్ల దేశదేశాలకు రాజులయినందుకు వారి కథలు విన్న
ఆ రాజలోకమంతా ఆనందించింది. ఈలోగా మాళవ
రాజైన దారువర్మ మరలి వచ్చినట్లూ, పుష్పోద్భవుని
బంధించినట్లు వార్త వచ్చింది. వెంటనే ఉద్రేకంతో మిత్రు
లంతా తమ తమ సైన్యాలతో కోట ముట్టడించారు.
క్షణంలో దారువర్మ దర్పమణగిపోయింది. అతడు రాజ

వాహానునికి లొంగి దాసోహమన్నాడు. సంధి షరతులుగా కోరి సింహవర్మ పుష్పోద్భవుని విముక్తుని గావించి, రాజవాహనునికి అవంతి సుందరి నిచ్చి పెళ్ళి చేయించాడు. అటు సోమదత్తుని కీ వర్తమానం తెలిపి పంపారు. అతడు హుటాహుటీని వచ్చి తన మిత్రులందరినీ వేర్వేర కలిసి కుశల మడిగి ఆదరించి ఆనందించాడు. అంబాలికకు అపహార వర్మకు కూడ మహా వైభవంగా వివాహం జరిగింది.

ము గిం పు ;—

కుమారు లందరూ మాళవంలో చేరినారనే వార్త చారుల వలన విని రాజహంసుడు వారిని వెంటనే తన వద్దకు రమ్మని వర్తమానం చేశాడు. అతని మాట పాటించి కుమారదశకం, తమ భార్యలతో కూడ వెళ్ళి తల్లి దండ్రుల వంటి వారైన వసుమతీ రాజహంసులను, గురువుగారైన వామదేవుని దర్శించి వారి ఆశీర్వచనాలు గ్రహించారు. కొన్నాళ్ళయాక తిరిగి సేనాసమేతులై మగధను వశం చేసుకొనేందుకని బయల్దేరారు. వీరు వస్తున్నారనే వార్త విన్నదే తడవుగా శత్రువులు రాజ్యం విడిచి పారిపోయారు. రక్త ప్రవాహం అక్కరలేకుండానే రాజ్యం రాజవాహానుని వశమయింది.

ఒక శుభముహూర్తాన రాజహంసుడు పత్నీ పుత్ర పరివార సమేతుడై తిరిగి తన రాజధానికి చేరుకొన్నాడు. మళ్ళా యథాపూర్వంగా తన రాజ్యాన్ని తాను ధర్మంగా

పాలింపసాగేడు. కుమారుల బాహుబలం తన సంపదకి పెట్టనికోటగా ఉండగా, వారివారి రాజ్యాలు తనకు మిత్రి రాజ్యాలుగా ఉండి అవసరానుకూల సహాయాలు చేస్తూ ఉండగా మునుపటికంటె పదింతలు ఎక్కువ వైభవంగా రాజహంసుడు ఈసారి మగధ నేలసాగేడు. యువరాజుగా రాజవాహనుడు ప్రిజల అభిమానాన్ని చూరగొన్నాడు. అందరూ అతని కీర్తి చెప్పుకో ఆనందించేవారు. అతని మిత్రులు అడప తడప అతని దర్శనార్థమై పాటలీపుత్రిం వచ్చి పోతూఉండేవారు. కాలక్రమాన్న యీ మిత్రుల సహాయంతో రాజవాహనుడు దిగ్విజయం చేసి తండ్రిచేత రాజసూయం చేయించాడు. తర్వాత కొన్నాళ్ళకి రాజహంసుడు రాజ్యం చాలించి రాజవాహనునికి పట్టాభిషేకం చేసి తాను తపస్సుకు పోయాడు. రాజవాహనుడు సకల భోగాలు అనుభవిస్తూ చక్కగా రాజ్యం చేయసాగేడు.

